ప్పయ్య మరుపుట దోషకరముగును. పెద్దలైన ఆదరము ముఖ్యముగా, అన్నయగు రఘునాథయ్యపై విశేష గౌరవము. దైవభక్తి కూడ విశేషముగా నున్నట్లు తెలియుచున్నది కాని కొన్ని సందర్భములయందు రామప్పయ్య కఠినాత్ముడుగా నున్నట్లు కనబడుచున్నాడు దీనిని బలపఱచునట్టి యొక కథ 'కొంగు మండలశతకం' అను తమిళ పుస్తకమున గలదు.

సక్రమముగా కప్పము చెల్లింపని హేతువుచే, రామప్పయ్య కొందరు పాళెగార్లను కారాగృహమున బంధించెనట వారిలో అణూర్ 'సంబంధ చర్కరై' అను పాళెగా డొకడు కలడు. అతడు తమిళ భాషా పోషకుడుగా ప్రసిద్ధికెక్కెను ఒకనాడొక కవి బంధితుడై యున్న 'సంబంధ చర్కరై'ను సందర్శించి యతనిచే సమ్మానితుడగుటకు యత్నించెను అప్పుడు తనయొద్ద ఏమియు లేకుండుటచేత సంబంధ చర్కరై తన భార్యను దర్శింపుమని కవిని కోరెను ఆమెతో కవి యీవిషయమును నుడివిన వెంటనే, తన మంగళసూత్రమును కవికి సమ్మానించెనట ఆ మహాయిల్లాలు! ఈ అద్భుతవిషయమును దళవాయి రామప్పయ్యకు తెలియజేసినవెంటనే పశ్చాత్తప్తహృదయుడై దళవాయి సంబంధ చర్కరై సచ్చరిత్రమును కొనియాడుచు అతనిని బంధవిముక్తునిగ జేసెను ఇటులనే యుద్ధసమయములందు రామప్పయ్య బంధితులను బాధించెనని అమ్మానై నుడువుచున్నది

ఇక, రామప్పయ్య మరణమును గురించి విచారింతము తిరుమలకారి నాయకుని మరణమునకు సంబంధించిన కథలవలెనే, రామప్పయ్య మరణమును గూర్చికూడ కథలు పెక్కు లున్నవి సేతుపతితో యుద్ధ మొనరించుటకుగాను రామప్పయ్య పాంబన్ కాలువపై ఆనకట్ట కట్టి, జడైకదేవునితో యుద్ధము చేయుచు వీరస్వర్గము నలంకరించెనని కొందరు చరిత్రకారులు విశ్వసించుచున్నారు జడైకదేవుడు గావించిన 'చేతబడి' ఫలితముగా రామప్పయ్య మరణించెనని కొందరు నుడువుదురు. విషప్రయోగము వలన మరణించెనని మరికొందరి నమ్మకము ఇటుల రామప్పయ్య మరణమును గురించి భిన్నాభిప్రాయము లున్నను, ఇతడు క్రీ. శ. 1658 ప్రాంతమున మరణించి యుండవచ్చునని నుడువవచ్చును. ఏలయన, యుద్ధమున మరణించిన రామప్పయ్యకు పిమ్మట, అతని అల్లుడగు శివరామయ్య తిరుమలకారి నాయకునిచే దళవాయిగ నియమింపబడెను శివరామయ్యకును, సేతుపతికిని జరిగిన యుద్ధములో సేతుపతికి పరాజయము కలిగినది కొన్నాళ్ళు జడైకదేవ—సేతుపతి మధురలో కారాగృహమునందుండి, తిరుమలకారి నాయనివారి అనుగ్రహము తో సంపాదించుకొని మరల రామనాథపురమును పరిపాలించి, 1645 సంవత్సరమున జడైకదేవ సేతుపతి తన తమ్ముడగు 'తంబి'చే హత్యగావింపబడినట్లు రామయ్యన్ అమ్మానై నుడువుచున్నది కనుక, రణరంగమునందే రామప్పయ్య మరణించెనని నుడువుట సమంజసముగ కన్పించుచున్నది.

పయి నుదాహరించిన విషయము లన్నియు రామయ్యన్ అమ్మానైలో పేర్కొనబడినవి ఒక్కొకచోట రామప్పయ్య 'పులిరామయ్య' అనియు 'రాక్షసులను సంహరించిన రాము'వంటి వాడనియు ప్రస్తుతింపబడినాడు రామప్పయ్య, సేతుపతులకు జరిగిన యుద్ధము మనోజ్ఞముగ చిత్రింపబడినది ఇటుల రామయ్యన్ అమ్మానై రామప్పయ్య జీవితవిశేషములనే గాక, ఆనాటి సాంఘిక రాజకీయాది పరిస్థితులనుగూడ కండ్లకు గట్టినట్లు తెలివిడి చేయుచున్నది కావున, రామయ్యన్ అమ్మానై చారిత్రక దృష్ట్యా అమూల్యమగు గ్రంథమనుట నిర్వివాదాంశము ఈ గ్రంథమున వర్ణితమైన రామప్పయ్య గాధ కూడ తెలుగువారికిని సంబంధించినదని నుడువుట అత్యుక్తి కానేరదు. ప్రతిభావంతుడైన దళవాయి రామప్పయ్య జీవిత చరిత్రము తెలుగువారికి మాత్రమే గాక దాక్షిణాత్యుల కెల్లరకు చిరస్మరణీయము!

# విరహి



శ్రీ కోడూరి ఉమామహేశ్వరం

నామనసెల్ల నందనవనస్థిత కోమల పారిజాత మా
లామధురాత్మకంబయి నిరామయభావ నిలీన గోపికా
కాముకనయ్యె కృశించెడినికంపిత ఖండిత నాయికా మృగా
క్షీమృదుశయ్యయై పరిమళించెడి గంధవు పచ్చిముద్దయై

వన్నని యేటివంకల పిసల్లు పిసల్లు తురాయిపూలు పూ
యన్నజరైన తెక్కతుదిజుంచుల సోలిన పాలపిట్ట శే
వన్నెలవైన నాయెడద భావుకతా మధురోహ తెన్నిరో
చిన్నెలు గ్రుమ్మరించుచును చేష్టడిపోయె రసాపకర్షముల్

సుమధుర సాంధ్యరాగముల శోభలు చిమ్మిన యాకసంబుపై
గుమురుకవచ్చు రక్తిమను గూర్చి పసిండివలెన్ భ్రమించితిన్
విమలినమైన జీవితము వెక్కసమై తటితీపు లారి హై
కము విడివడ్డ నాకునయి క్రమ్ముకువచ్చె విషాద మేఘముల్.

సలలిత పుష్పకోమల వసంత సదృతుము యౌవనంబు , నా
వలపుల పంట నీవనెడి భావన చేయుచు నున్ననాకు ని
ర్మల మధురోహ సమ్మిళిత రాగపికీమృదునాద సంస్వరం
బులు విన గోర్కిపుట్టెడినిపో-యెడ లేక పహార్నికంబులున్.

కమ్మని పండువెన్నెలలు గాయు దినమ్ములు పోయి కృష్ణప
క్షమ్ముక దాపురించునని సారెకు సారెకు నాయెడందలో
గ్రమ్మి విషాద మేఘపటలమ్ముల నిండిన చిమ్మ చీకటిన్
వమ్మయిపట్టె నాప్రణయవాంఛలకై తపియింతు నోసఖి !!

ముదరని ప్రేయసీ ప్రణయ ముగ్ధ మనోహర ప్రేమగాథ నా
మది వదలించుచున్నది సుమా వినుమా యనుమాన మేలనో
ముదవతి ! నాటి నీమధుర మంజుల ప్రేమరసార్ద్రమూర్తి యె
ప్పుడమయి నేటికిన్ మధురవీక్షల నన్ను గృతార్థు జేసెడిన్

భావజుని చిత్తవృత్తి భావముల నెఱిగి
యుత్తమ గృహస్థ ధర్మంపు వృత్తమెఱిగి
మదన సామ్రాజ్య వైభవాస్పదుల మగుచు
నాకనంబున విహరింప నభిలషింతు.

---

# తమస్సులో తపస్సులు



శ్రీ మునిపల్లె రాజు

మా స్వగ్రామం అటు జిల్లా ముఖ్యపట్టణానికి యిటు తాలూకా ముఖ్యపట్టణానికి దగ్గర్లో, గ్రాండ్ ట్రంకురోడ్డు బస్సుమార్గంలో ఉండటంలో మా గ్రామీణ నాగరికతలో చాలా పెద్ద మార్పు వచ్చింది. శ్రమ అనుకోకుండా మీరు మా ఊరికి ఒక్కసారి దయచేస్తే, యీ నాగరికతను బరోమీటర్ మీద కొలిచినట్లు కొలిచి చూడవచ్చుని మనవి చేస్తాను. మచ్చుకు ఒకటి రెండు ఉదాహరణలిచ్చినా మీరు గ్రహించగలరని నమ్ముతాను. వెనక మా గ్రామానికి గ్రంథాలయోద్యమోద్యతులు వచ్చి ఉపన్యాసాలు దంచినప్పుడు వచ్చిన ఉద్రేకంతో పదిమందిమీ కూడ బలుక్కొని ఏ స్థలంలో పెంకుటింటి గ్రంథాలయం స్థాపించాలను కున్నామో, ఆ పవిత్ర స్థలంలో నేడు ధూమయ్యగారి చిన్న కాఫీ హోటలు వెలిసింది. మా ప్రెసిడెంటుగారు (వీరికి సంతకంవరకూ వచ్చు) సహకారసంఘం పేర్లు పోగు చేసి, వారి స్వంత చిట్టాలో జమకట్టక పూర్వం, మేము కట్టించదలచుకొన్న దాబాయిల్లు గ్రామ సహకార సంఘస్థలంలో ఇప్పుడు ముచ్చటైన తేరా సినిమాహాలు వచ్చింది. ఇంకా చూస్తే, మా గ్రామంలోకూడా రోజుకు యాభైకి పైగా సిగరెట్టు పెట్టెలూ, వారానికి డజనుకుపైగా కొత్త చీట్లపేక పెట్టెలూ ఖర్చైపోతూంటాయంటే నమ్మండి. అంతేకాదు, గత చరిత్రలో మా ఊర్లోని రెండు పార్టీలవారు ఏ విషయంలోనూ ఏకీభవించి ఉన్నట్లు ఎవరైనా వృద్ధులకు కూడా జ్ఞాపకం లేదు. కాని ఇప్పుడు ముచ్చటగా ఉండి, అంటే గ్రంథాలయం కట్టవలసిన పునాదులు పైకి లేవకుండా చేసేందుకు పెట్టిన అర్జీల్లోనూ, ప్రజల పేర్ల ధనాన్ని సొంతపు పెట్టెలో కట్టలుగా అట్టే పెట్టుకొన్న ప్రెసిడెంటుగారి అరెస్టు తప్పించటంలోనూ, మా ప్రాథమిక పాఠశాల ప్రాథమికోన్నత పాఠశాలగా మారకుండా అడ్డుపడ ఏకపక్షంగా తీర్మానిస్తున్న జాగ్రతలోనూ—తరతరాలనుండీ తన్నుకొన్న ముఠా కక్షలు యిట్టే మాయమైపోయాయని నేను గర్వంగా చెప్పగలను.

ఇటువంటి మా స్వగ్రామాన్ని మీరు పల్లెటూరని గాని, బస్తీ అని గాని అనలేరు. ఈ బస్తీ, పల్లె రెండూకాని మా ఊళ్ళోకూడా ధర్మదేవత ఒక పాదంమీదయినా నడుస్తున్నదని నేను విన్నవిస్తే మీరు ఆశ్చర్యపోయేందుకు పనిలేదు! మా పడమటి బజారు పురాతన నాగరికతకు శ్రీరామ మంటపం ఆట పట్టు.

ఇక్కడ మీకు ఒక చిన్న విషయం మనవి చేయాలి. మీకు సంవత్సరంలో ఋతువులెట్లా మారుతుంటాయో, మా శ్రీరామ మంటపంమీద సీజన్లు కూడా అట్లా మారుతూ ఉంటాయి. మొన్ననే గడిచింది. పులి మేక జూదం సీజను అంతకు ముందు సీజను చీట్లపేక సీజను ప్రస్తుతం జరుగుతోన్నది—పురాణ కాలక్షేప సీజను, వర్తమానమైన ఈ పురాణ కాలక్షేప సీజను పుణ్యమహాత్మ్యంతోనే మన కథకూడా ప్రారంభం అయింది. ఈ సీజను ప్రారంభంలోనే మా ఆచార్యులవారు "ఒరే, మనవూళ్లో ధర్మం నాలుగు కాళ్ళమీద సంచరించటం లేదని ఎవర్రా అనేది?" అని నావంటి సంస్కరణ వాదుల్ని సవాల్ చేసి, మందలిస్తూంటం కద్దు.

* * * *

ఆరోజున శ్రీరామ మంటపం అరుగులమీద స్థల పురాణ కాలక్షేపం నిరాఘాటంగా సాగిపోతున్నది. శాస్త్రులవారు మంచి పండితులే గాకుండా, కొంచెం సంగీత విద్యలోకూడా ప్రవేశం గలిగినవారు కావటంలో వారి శిష్యవర్గంలో ఆ బాల గోపాలమూ ఉన్నారు.

శాస్త్రులవారి పేరుగా మావిళ్ల భక్తి విశేషం వర్గం అభిమానిస్తుంది. వారికి ఎదురుతిరిగేవారా క్షీణిస్తుం

"ఏరా - పిలుపుగా! నువ్వు చచ్చిపోయా వంట నిజమేనా!" అని తను అడిగాడు.

వాడు నవ్వి—"అబ్బుసు—అబద్ధమేమంది! నేను గవబట్టల్లా!" అన్నాడు.

"అరేయ్, ఎందుకు చచ్చావురా!"

"పచ్చినోళ్ళమీద పైవవేయకుంటే!"

ఈమాటతో యాదవులికి జాగ్రత వచ్చింది. మళ్ళీ దెయ్యాలలోకంనుండి భూమ్మీదకు దూకినట్లుయింది. భయంతో అర్థంలేని అరుపులు అరవసాగాడు. ఈ భయంకర శబ్దానికి గుళ్ళో ధర్మకర్తల ఏకెంట్లయిన గబ్బిలాలు లేచి చెదిరి అటూ యిటూ ఎగరసాగాయ్. యాదవులు వినాయకుణ్ణి కావిలించుకొన్నాడు. కాని గబ్బిలాలు తలమీదనే రెపరెప కొట్టుకొంటున్నాయ్. శిథిల దేవాలయపు మొండి గోడలు చీకట్లో ఆకాశం మెత్తగా పెంటిగి పోతున్నట్లు యాదవులికి కనిపించింది. గుడిపవక చింతచెట్లమీందిగూడా ఏవో శబ్దాలు వినిపించినై. ఒకానొకది వానశబ్దం.

వినాయకుడి రక్షణ వదిలి యాదవులు బయటకు పరుగు లంకించుకున్నాడు. ప్రాణభయంతో "అమ్మోయ్, ఓరిబాబో! నాయనో! బాబో!" అని అరుచుకుంటూ బయట ఎదురుదబ్బ తగిలి బోక్కబోర్లా పడి లేవబోతూండగా, తండ్రి వానలో గొంగళి కప్పుకొని తనకు వెతుక్కుంటూ వచ్చాడు.

రాముదాసు ఠక్కున యాదవుల్ని పట్టుకొని—

"ఏరా! ఒళ్ళు కాగిపోతున్నది జొరం వచ్చిందా?" అని అడిగాడు.

*  *  *  *

యాదవులు జ్వరం మరునాడుగూడా తగ్గలేదు. రాముదాసు మంగలి వైద్యుణ్ణి పసరు అడిగేందుకు వెళ్లాడు. యాదవులికి రాత్రి అనుభవం కలో నిజమో అర్థం కాలేదు. అర్థంకాక—"అమ్మా, ముక్కు పిలుపుగాణ్ణి చూశావే?" అన్నాడు తల్లితో.

అదృష్టం కొంచెం ఆశ్చర్యంగా కొడుకువంక చూసి—"నీకేమి రా పిచ్చి? పిలుపుగాడు చచ్చి అయిదేళ్లయిందే" అని సమాధానం యిచ్చింది.

"కాదే! నిజమే!" అని యాదవులు అనబోయాడు గాని అమ్మతో చెప్పాలనిపించలేదు. ఆ మగతలో మళ్లీ ముక్కు పిలుపుగాడు కనిపించాడు.

ఆ మత్తు మత్తు రాత్రికిగాని తెలియలేదు యాదవులికి జ్వరం పెరిగిపోతున్నది. వాడి ఒంటిమీద ఏ స్పృహా నిలవటంలేదు. ఈ ఒక్కరోజు జ్వరానికే చిక్కి శల్యమైపోయాడు. రాముదాసు ఒకటికి రెండుసార్లు మంగలి వైద్యుడిచుట్టూ తిరిగాడు. తండ్రి జాగరణ చేస్తూండగా యాదవులు జాలిగా చూశాడు.

"ఏంత గొట్టావా? తూర్పు కొలవలో?" అని రాముదాసు అడిగాడు.

"లే దే! ఊ హూ!"

"మరి జ్వరం దేనికిరా?"

యాదవులు సమాధానం చెప్పక, కళ్లు మూసుకున్నాడు. కొంచెం సేపటికి కళ్లు తెరిచి—

"అ య్యా!" అని తండ్రిని పిలిచాడు.

"అయ్యా పచ్చినోళ్ళమీద పైసవేయకుంటే తిరిగి బతికినోళ్లు వస్తారా?"

"ముస్తేయకున్నావా?"

"అహా! ముక్కు పిలుపుగాడు"

"పిలుపుగాడికి చిన్నప్పుడు జొరంవచ్చి చచ్చిండు"

యాదవులికి యీ సమాధానం ఏమీ నచ్చలేదు. నచ్చక తండ్రి బయటకు పోవటంమాని తల్లిని పిలిచి అడిగాడు. కొడుకు పిచ్చిలచ్చన్మ "నిజమే" అన్నది.

నాలుగురోజులు గడిచినా జ్వరం తగ్గుముఖం చూపలేదు. రోజురోజుకూ రోగి చిక్కిపోతూన్నాడు రాముదాసు, కొడుకు పక్కమంచపు కాళ్ల గట్టున కూర్చొని కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాడు. అది చూచి యాదవులు—"అ య్యా" అని పిలిచాడు. కాని ఏదో అవ్యక్తంగా, హస్తాల్తో గుర్తులు చూపాడు.

"అయ్యా. కో...వ. మూ..?"

"ఊ. చూడా" అని తలూపాడు రాముదాసు ఏమీ అర్థంగాక.

"కొడుకోలా?"

"ఏమిటీ?"

"కోమటి గురవయ్యమీద పైసలు"

"అరి పిచ్చిదానకొడకా, ఏమయిందే?"

"కా డు"

"మ రి"

"బుక్కా పిలుపుగాడు"

కోగి పెద్దగా అరిచాడు. మూలిగి మగతలో తిరిగి పడిపోయాడు

* * * *

ఎనిమిదిరోజుల జ్వరానికి అంతులేదు. ఎనిమిదో రోజున యాదవులు తన స్నేహితులు పింగళ్ని, మాణిక్యం కొడుకు యల్లమందను, యానాది ముల్లిగాడిని, కాపుల పిల్లాడు చినకన్నయ్యను పిలిపించుకొన్నాడు

"అ రే య్ యల్లమందా నువ్వు చెప్పింది నిజంరా!"

"ఏంది???"

"బుక్కా పిలుపుగాడి మాట"

యల్లమంద నవ్వి "అబద్ధం అబద్ధం నిన్ను బయాలు పెట్టేందుకు చెప్పాన్రా"

యాదవులు జీవంలేని గొంతుతోనే, భావి అనుభవంనుండి మాట్లాడాడు

"నిజంరా ఆ డు. నాగ్గనబడిచెప్పిం డు"

పిల్లలందరూ దిగాలుపడి చూశారు. అందరికీ కళ్లనీళ్ళు వచ్చినై తంబోయిల మాణిక్యంకొడుకు యల్లమంద పెద్దగా ఏడ్చాడు

మళ్ళీ యాదవులు మాట్లాడాడు.

"అ రే యాడో.. పోవద్దురా.. నేను బుక్కా పిలుపుగాడిదగ్గిరి కెళ్ళాన్రా! మా కాలువ చెప్పి, నేను ఇచ్చినాక పైసలు ఇల్లిపిస్తాను. అల్లా! నువ్వేంబోయ్ పింగళీయ్యా, చినకన్నయ్యకు ముల్లిగాడికి చెరిసగంగా యియ్యరా"

యాదవులికి మళ్ళీ తెలివి అర్ధరాత్రికి వచ్చింది రామదాసు కొడుకుముందం వదల్లేదు.

"అ య్యా నేను బ తి . గురవయ్యకు ఇల్లి వట్టు పైసలు ఇల్లుకొవు గా"

ఈమాట రామదాసు కాపురుమని ఏడ్చాడు

అరాత్రి తెల్ల్పన తెల్లవారింది రాత్రంతా యాదవులు కలవరిస్తూనే వున్నాడు జ్వరం గంటగంటకూ ముదిరిపోయింది మంగలి వైద్యుడు గరళం పోసి ఏర్పాట్లుచేసి, పన్నెండేళ్ళ యాదవులి యూసుగిచి పట్టుపేస్తున్నాడు కాని తంబోయిల మాణిక్యం కొడుకు యల్లమంద భవిష్యత్ చెప్పినట్లు తొమ్మిదో నాటికల్లా యాదవులు యిహలోకయాత్ర చాలించాడు

* * * *

ఆరాత్రే గ్రామస్థులు రామదాసును, దచ్చిపోయిన గురవయ్య చెట్టి కొట్టుకు కన్నంవేస్తూండగా పట్టుకొన్నారు

దొరలందరూ దొంగను అడిగారు—

"ఎందుకుచేశావ్ దొంగతనం?"

రామదాసు అన్నాడు సమాధానంగా—

"నా కొడుక్కు చెవ్వంమీద పైసలకి"





# సత్యాగ్రహం



శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

పూర్వం
ఉండేది మనుష్యుల్లో సత్యాగ్రహమొకటి
అది దేవికరాల్లో
ఒక కరవాలంగా నిలబడి
అన్ని నడుమదారుల్లో పొంచివున్న దౌర్జన్యాన్ని
సమూలం చెండాడ్తూ
ఆ దొంగతనపు దాగుడులో
మానప్రసీమల చెల్లాచెదర రౌనరించుటలో
ఉపయోగపడే దప్పుడు

అసిపిడిపై పిడికిలి దేవి బిగించిందా
ఆ పాతకలోక దురాశారాసులు
తమకుటి దట్టపుచీకటి భటలను
వదలి కదలిరా భయపడి నక్కా వొకమూల.

కాని
ఈరోజుల్లో దుష్టశిక్షణార్థం
దేవిదాడి సలిపే అవసరమున్నప్పుడు
చూశారా ఆ ఆయుధమెవరన్నా ?
ఊరక నిలబడి చూస్తున్నది
దేవి నేడు అన్యాయాన్ని !

కళ్ళు జిగ్గుమనిపించే అమర కాంతిపుంజం
అయుతసీమను
నల్లుదిశలై ప్రవహించకపోవడం వల్లను—
దౌర్జన్యబుద్ధి కార్కశ్యం అణగారిచి
దాన్ని నిలువనీడ లేకుండా
[illegible]
కాలఖడ్గ ప్రళయ[illegible]
ఆ శిష్టజనావన హస్తాల్లో.

నిలువకుండడం వల్లను
ఈ పాతాళ పిశాచుల వికృతాననాలు
సిగ్గింకే లేకుండా
ప్రతిద్వంది మొగం చూపి
పరిహసింప సాహసించు !

ఆ మునుపటిరోజుల్లో తొడిగిన ధర్మకవచమే
ఆనాటి శిరస్త్రాణమే
ఈనాడూ అంగాన ధరించి
సదాసిద్ధంగా ఉన్నదిదేవి
కాని నిర్దాక్షిణ్యంగా
కాపట్యం మొదలంటా పెల్లగింప
ఆమె అస లశక్తురాలు—
సత్యాగ్రహం లేదుజగతి .
లేదు దేవిచేతకత్తి

## 2

ఓ దివ్యకృపాణం !
మరొక్కసారి మాదేవి కరాలకు రావా ?
పరమాత్మునిబంధమై ఆమె మరల
ఈ భూముల్లో ఏపుగ పెరిగిన పాపపుపంటను
మొదలంటగ తెగగోయగ ?
ఓ అమరశక్తి సంకలితాగ్రహమా !
సత్యరౌద్ర జనితాసీ !
సృష్టిసమస్తం
మహాపూర్ణమై ఉన్న విధంగా
నానాగందరగోళంగా ఉన్నప్పుడు
దుర్భరతమ ప్రాకృతిక యుగాల్లో
ఆనందానికి వ్యతిరిక్తంగా ఉన్న ప్రతీదాన్ని

సమూలముగ నాశనం చేసితొలి
భగవానుడు స్వర్గాలు సృజించిన సమయంలో
క్రమవిహీనముగ విలయ ప్రకృతిపయి
దాడివెడలి పోసరిసి
ఆ మహర్గంనుండి
అనేక పవిత్రమండలాలా
నీలితారా తరళపాళి
సృష్టించావు గదమ్మా!
మూసిన వికస్త్రాగారంలో బందీవిప్పవు?
నీ నీల విశాల కనద్వారలు త్రుప్పెక్కినవా?
ఓ సత్యరౌద్ర జనితాసీ!
అమరశక్తి సంకలితాగ్రహమా!
ఆ క్రూరపిశాచుల వక్రపతాకల ఔద్ధత్యం?
ఎదిరింపగలిగేవాడీ, సత్యాగ్రహశక్తిలేదీ,
కుహ్నాలై పోవడాన్ని
దుష్టశక్తుల కాయమేదీ లేకుండా
ఇన్నాళ్ళై అసహాయగ నిలబడి ఉన్నదిజేవి
ఆమెకేలి కదలాడ్తూ
మాపాలాల పరిశుభ్రం చేయగరావా?
మహారౌద్ర భారంతో తన దోర్దండాలూగులాడ,
తనచుట్టూ విసిరే గాలివింత
వేడిపొగల సెగలెగయగ,
మరల మెదలనీ మహోత్సాహం
ఆపెం మనస్సులలో!
పరమప్రభు క్రోధాలు, బృహద్వ్యూహాలు,
మరల పొదలనీ ప్రాతలంలో!
ఓ సత్యరౌద్రజనితాసీ!
అమరశక్తి సంకలితాగ్రహమా,

## 3

ఆరోజుల్లో
మానవుని మనస్థలం
పవిత్రపీఠంగా ఉండేది
తేరిచూడరాని తెల్లదనంతో
వెలిగే పెద్దమంటతో
విరుగుగ కదులుతు, సుళ్ళుతిరుగుతూవచ్చే
ప్రళయానిల సంఘాతాల
భయంకర దంష్ట్రాగ్రాలంటే
గుండెల్లో బెదురగుటను
దుష్ట పరశక్తులు
ఆ పవిత్రమందిరం గడప త్రొక్కాలంటే
అతి జాగ్రత్తగ నడిచేవి
కానీ ఇప్పుడిప్పుడు
సత్యాగ్రహశక్తి అసలు
యుద్ధానికి సంసిద్ధంగా లేకుండుటవల్లను
ఆ రాక్షసశక్తులు
పట్టపగలె పాలిస్తున్నాయ్ ధరణంతా.
విచ్చలవిడిగా విర్రవీగుతూ
మనుజాని హృదయాన్నాక్రమించుకొంటు
న్నాయ్!
ఆ పదాల కదలికలను
దొంగచాటు దనం లేదు.
రకరకాల వికృతశకటాల చక్రాల్లో
మట్టేసిన ఎరదమట్టిలా
నేడా అసహాయ మనస్థలమంతా
తమ ఉన్మత్త పదాల అర్థహీన ప్రచలనాల.
ఎడత్రొక్కుడి పెడత్రొక్కుడి చేస్తూ
ఆ మార్దవమంతా మాపేస్తున్నాయ్!
అమరకాంతులేవో
నిరంతరం వస్తూనే దారులతో,
చలువలనొలికే గాలులతో,
భగవన్మందిరమే అనుభ్రమకలిగించే పవళ్లతో,
అమరుల అమృతపు బిందులతో కళకలలాడే
రాత్రులతో,
అతి సుందరమౌ మానవు మేధా వాతావరణం
చూసిసహింపగజాలక పోయిందా నారకపాతక
బృందం
కాపట్యకపటమ్ములను రగుల్కొల్పి,
కంజాయలతో భయంకరంగా ఉండే సంజల్లో
రంగమారిన అశుభత్వంనిలబెట్టి,
కాళమేఘపటలాంధతమంతో
సర్వాన్నీ ఆవరించి,
పగటివెలుగు మాయచేసి
తమ కనుకూలంగా ఉండే వాతావరణం
సృష్టింపగ మొదలిడిందా అసురశక్తిగణం
మనుజామనసు మిన్నుమీద
ఇసుకతుపానుల మబ్బులు
బిగువగ తేలాడజేసి

కుసుమగంధాల్ని పొందాయని!
నరుని ఆ వేల్పులాలోచనాతిరస్కారిణులపై
ప్రళయపువల్లని నీడల జాడలైనా కనరావా?

## 4

కానిదివరకంత మహోల్లాసంతో పాటలుపాడుతూ
మాలీపని చేసిన ఈ మానవజీవిత వనమాలాగున
పాడుపడటం చూసి దేవి ఎన్నాళ్ళు సహిస్తుంది?
హద్దులేని అహంకారంతో మిన్నూ మన్నూ గనకుండా

తిరిగే రక్కసిమూకలు నారక పాశవిక సైనికులు
కరకువనపు టడుగులతో ప్రేత చిత్ర నృత్యంతో
నెత్తుటి విరి రేకులు నిండిన దారులు పెనుత్రొక్కుతు
చీడపురుగుల్లా తోటంతా ఆక్రమించి
నాశనం వెదజల్లడాన్ని సహింకెన్నాళ్ళోర్పయస్తుంది?
ఓర్వలేని చేయగలదు?
మూర్ఖపు పేరాస,
స్వార్థం
మాత్సర్యం,
గోడలైన
నీచపు బందెలదొడ్డిని, ఊపిరి తిరుగని లాన
దేవి నేడు
కాదిగద!
మానవతన్నది బలవంతంగా వికృతి చేసి
మన అసురదౌర్జన్యం—
పొరటుదనంతో శృంఖలజగంలో
వెదజల్లుకు మనం హింసారతిలో పొందేసంతృప్తి—
కార్ఖానాలూ కొలుములూ
బిగియగట్టి ఉంచిన మన ఈ నాగరికసంఘం—
కని ఆమె అద మనసో అది
నీచపు బందెలదొడ్డి
ఊపిరి తిరుగని మడ్డిని
దేవినిలా
నేడు మనం బందీగా చేశాం!
మనం చేసే ఘోరాలకు మందలించలేను దేవి!
న్యాయం పేర మనం
లోకుగాయం చేసినగుండెలు—
సాలెపురుగు గూటిలోన కీటకాలలా
మన వ్యాపారపుటిమపడికిళ్ళలో చిక్కుకు
తప్పించుకునే దారిలేక
గిజగిజ కొట్టుకుపోయే హృదయాలెల్లా—
అబ్బా!
అది తలపుకు వస్తేనే
ఒడలంతా కంపిస్తున్నది!
బురదలోన పొరలాడే పందుల
బ్రతుకులకన్నా నికృష్టమౌ బ్రతుకులోన
మానవతన్నది దిగజారగ,
పైశాచిక కృత్యాలకు నిలయాలగు
ఖండాల పందులలో, గొందులలో,
వెలికివచ్చు పెట్టులేని
పాపపు కూపంలో
దిగబడి
ఎలాటి సైచ్యానికిగూడా
పాల్పడడానికి సందేహించని
పశుప్రవృత్తిని పొందుతున్న పే
ఎన్నెన్నో జీవాలు!
వాటికి పేదరికాన్నిచ్చి,
మనం చేసిన నేరానికి
అది శైశ్వల్లో కఠినశిక్షలనుభవించాలి!
జాలిఅన్నదే లేకుండా
తీవ్రాలను చేలను రాలిచి
ఆ రేకుల కాలను రాచే,
మనకర్కశకార్యానికి
మనలను మందలింపగల
మాన మండిరము
లేచివచ్చు శక్తిని గనలేదు దేవి,
తనకేలను నిల్పమి వాడి శక్తి!
పందులు, కోళ్లూ
పడిఉండే చోటులకన్నా
హీనమైన స్థలములలో నిద్రా,
తిండికాని తిండీ,
ఇంతేనా ప్రతిఫలం?
ఆఫీసుల్లో
ఫాక్టరీలలో
వడి సంద్రాల్లో
పొలాలలో
ఖర్చయిపోయే బ్రతుకులకు
మనమిచ్చే విలువ ఇదేనా?

విలువెంతో తెలియని
జీవితాలిలా
దుర్వ్యయమైపోవడం మంతం కాదా ?
కవాల్ని తొక్కని తిని బ్రదికే
రాబందుల్లా
మనమమానుషంగా
కోట్లకొలది తోడివార్ని లా
కడుపు తరుక్కునిపోయే పేదరికంలో
అణగార్చడమేనా ?
చిలుకల కేకలుకొరికే పిల్లులమై
పసిపాపలమనసుల వికసింపగనీయక
నమిలేస్తామా ఈలాగున ?
తిండిలేక మాడడానికో—
లోహచక్ర పైశాచికవిజ్ఞానం
మానవ నివేదనాశక్తిని
భయంకరంగా ఆకర్షిస్తూ,
అంతులేని రహస్యార్యంతో
తమ ఉన్మత్తోన్మత్తుల భ్రమణ
హృదయ విదారణ దారుణ
భీషణ ఘోషణలతో
కార్మికుల హృదంతరాలు
దొంగిలించివేయగా
చివరకచట
మానవులే నిర్జీవ పదార్థాలుగ
యంత్రాల్లో భాగాలే జీవంగలవస్తువులుగ
మారే యమసదనాల్లో
లేబతుల్లు శ్రమించడానికో—
రాక్షసత్వమునతోడివార్ని లా పేదరికంలో
అణగార్చడమేనా ?
మన కార్యకలాపాల్లో
ఒకసారైనా
సౌందర్యమనే మాటను
తలపెట్టగలేమాఇక ?
చేయడాని కింకేం లేదా
దైవానికి మొరలిడుకోడం మినహా ?
ఛీ, ఛీ, ఇంత అశక్తులమా ?
పాశవిక శక్తులమా !

* * * *

ఒకనాటి మానవసంఘంలో
కదలాడిన సత్యాగ్రహార్తి
మరి ఒకమారీ కుళ్లు ప్రపంచంలో
కదలే సుదినం రాదా !
అపుడు దేవి దుఃఖభరంతో
కనుకొలకుల జార్చెదసలు
దుర్బలమైన అశ్రుధార !
ఒక్కుమ్మడుట లేస్తుంది !
క్రోధపూర్ణ తీక్ష్ణవహ్ని
కదలాడే పిడుగుల అనిఒక్క
అపరమాత్మని దివ్యరౌద్రి
తనకేల చలిస్తుంటే
ఆమె మనస్సంతా
ఉత్సాహంతో
పొంగి పొరలుతుంది !
నరకంలో
ప్రళయపు 'క్యారీ' గుట్టలలో
రాయిరప్పు సంతరించి
తన్ను కాలు పెట్టనీక
మానవజీవిక చుట్టూ
దుష్టశక్తులలాకట్టి
నిలబెట్టిన గోడలు
పునాదుల్లో దేవి
పేలబడ గొడ్తుంది !
కృతక తారతమ్యాల్ని
అన్యాయపు వ్యాపారాన్ని
పేరాసలయాజమాన్యమునకు దోహదమగుపద్ధతుల్ని
ఒక దెబ్బకు తెగగొట్టుంది
దీక్షాపరతంత్ర, దేవి,
సత్యాగ్రహ తరకలనితనిత నిశితాసి ధారతో !
ముక్కముక్కలై, పొగలై,
ఈ దౌర్జన్యాలన్నీ
మచ్చునకన్నా కనబడకుండా
మాయమైపోతాయి ప్రపంచంలో !
అన్యాయం మనస్సులో
మరణభీతినింపే స్వరకల్పనతో
విలయగీతికలు పాడుతుందప్పుడు దేవి !
తిరిగి
తనవికాల రాజ్యవీధుల్లో
ఊరేగుతుంది

# చంద్రేణైకపుత్రః

శ్రీ శ్రీనివాస శిరోమణి

•

"అక్కయ్యా, బావ ఏంచేస్తున్నాడు" అంటూ పొద్దునే కరణము రామయ్య వచ్చి సుబ్బమ్మను అడిగినాడు

"కూర్చోండి పంతులూ, నిన్న ఉదయము పాలెంపోయినారు ఇంతవరకూ రాలేదు రాత్రికి వస్తాము అన్నారు" అన్నది సుబ్బమ్మ

"ఎందుకు పోయినాడు?"

"అక్కడ వారి కొయ్యాడు ఎవడో పిల్లగాడు ఉన్నాడుట. వాణ్ని పెంచుకోవలసింది అని వారి వారు అందరూ పట్టుపట్టినారు ఆ పిల్లవాణ్ని చూచుటానికి పోయినారు"

"అదేమిటి అక్కయ్యా, బావకు మతిపోతే పోయింది, నీకుకూడా మతిపోయిందేమిటి?—ఏ ఒక్క చోటనైనా పెంపుడు కొడుకు అతకడము కాని పెంచుకొన్న తల్లిదండ్రులకు ఉపయోగపడటము కాని చూచినారా! లేనిపోని తద్దినం పెంపుడు అంటే తగాదా కొనుక్కోడము అన్న మాట ఈ శాస్త్ర విషయము నీకట్లా తోచలేదు" అన్నాడు రామయ్య

"పంతులూ, మీ బావగారి సంగతి నీకు తెలియనిదేముంది! అనుకొన్నట్టు చేసి తీరవలసిందే"

"కాదు లేవమ్మా, నీకు తోచిఉండదు లేక పోతే నీవు చెపితే బావ వినకపోవటము ఏమిటి!—"

"అయితే నాఇష్టముతోనే మీ బావగారు ఈ ప్రయత్నము అంతా చేస్తున్నారు అంటావా?"

"కుతరాయామా."

సుబ్బమ్మ ఒక్కనవ్వు నవ్వింది. "సరే ఆయన గారు రానియ్యి చూదాము" అన్నది.

"అయితే అక్కయ్యా, నీకు పిల్లలు కనే వయస్సు మళ్లింది అంటావా?"

"ఇంకేమి పిల్లలు నేను కిందటి గాలివాన ఇంకా అయిదు సంవత్సరాలకు ముందు అనగా కాపురానికి వచ్చినాను గాలివాన కొట్టి ఎన్నేళ్లు అయిందో లెక్కచెప్పు"

"గాలివాన కొట్టి ఇప్పటికి పాతికేళ్లు అయింది ఏమోలే—నీ కడుపున ఒక కాయ కాయ కూడదూ" అన్నాడు రామయ్య

"చాలులే—నీ చమత్కారము నలభైఅయిదు దాటిపోయినవి ఇంకా పిల్లలు ఏమిటి"

"పోనీలే—నీవు పిల్లలను కనలేక పోయినా మా బావకు పిల్లలు పుట్టే వయస్సుమాత్రము మళ్ళలేదు"

సుబ్బమ్మ నవ్వింది కాని ఆమె ఊహలు ఎక్కడెక్కడికో పోయినవి ఒక్కసారి రామయ్యను తేరి పారచూచి "నిజమే పంతులూ, నీవు అన్నట్టు నా పిల్లవాడు కాకపోయినా ఆయనగారి పిల్లవాడు అయినా కొంత నయమే" అన్నది

"అదేనమ్మా నేనూ చెప్పుతూఉంది" అని రామయ్య అంటూ ఉండగా కిర్రుచెప్పులతో గ్రామమున్సబు నారయ్య వచ్చినాడు రామయ్యను చూస్తూ "పంతులూ ప్రొద్దునే వచ్చినావు. ఏమిటి తహశీల్దారు మన ఊరు వస్తున్నాడు అని కాదు ఏమైనా పంపించినాడా" అన్నాడు

"అదేమీలేదు ఒక జోస్యుడు మన ఊరువచ్చినాడు. ఆయన పాండిత్యము మీరు పరీక్షించవలెను"

"ఇంతకూ నీకు ఆయన ఏమి జోస్యము చెప్పినాడు" అంటూ నారయ్య కుర్చీలో చేరగిల బడినాడు.

"ఇప్పుడు ఉన్న వాండ్లు చాలనట్టు ఇంకా నల్గురు ఆడపిల్లలు పుట్టుతారు అన్నాడు"

“కళాప్ బొత్తము పదిమంది అవుతారు అన్న మాట అదుంది అంటే మా చెల్లెలుకే తగిపోయింది చూడు మీ అక్కడను ”

“సరేలే సరాగము” అంటూ సుబ్బమ్మ “ఎప్పుడో ఎందుకు పంతులూ—ఆ జోస్యులను ఇప్పుడే పిలిపించు మీ బావగారు పోయివచ్చిన పని పండో కాయో తెలుసుంది మాకాము” అన్నది

“పంతులూ—ఇప్పుడే పిలిపించవయ్యా—మధ్యాహ్నమునుంచీ నేను మళ్లీ ప్రయాణము అయిపోతాను మాతోపాడు లేను ఎవరిని పంపిస్తావు” అన్నాడు నారయ్య “గురవణ్ణి పంపిస్తానులే” అంటూ సుబ్బమ్మ లోపలికిపోయి పాలూ పెరుగూ నెయ్యి మొదలు అయిన మోయగాను సామగ్రులు అన్నీ ఇచ్చి అవన్నీ కరణముగారి ఇంట్లో ఒప్ప చెప్పి అక్కడ ఉన్న జోస్యులవారిని వెంటనే పిలుచుకొని రమ్మన్నది రామయ్య గురవణ్ణి చూస్తూ “వీడు ఎవడుబావా, గుండు అల్లే ఉన్నాడు వీడు ఏ దేశమునుంచి ఇక్కడికి దిగినాడు” అన్నాడు

“మా అక్క వంటచేసుకోలేక చిత్తూరుజిల్లా నుంచి అల్లా వీణ్ణి రావించిందయ్యా” అన్నాడు నారయ్య

“వీడు అట్టే తినడేడు అనుకొంటాను”

“చాలు లెక్కురుమీ వేళాకోళాలు జోస్యులు వచ్చేసరికి మీరు కొస్త మంచిమాట చేసుకోండి” అంది సుబ్బమ్మ, నారయ్య లేచి ఇంట్లోకిపోయినాడు



నారయ్య మామూలు గ్రామ మున్సబుల మాదిరిగా కరణాల దస్త్రాల కావలివాడు కాడు అతను బుద్ధిమంతుడు. ప్రతిభావంతుడు, చిన్నప్పుడు అయితే చదువుకోలేదు, కాని వయస్సు వచ్చిన తరువాత ఒక భట్టురాజుగారిని ఇంట్లో ఉంచుకొని తెలుగు ప్రబంధాలు అన్నీ చదివించుకొని తెలుసుకొన్నాడు వ్యవహార జ్ఞానముకోసము ఒక ఇంగ్లీషు అయ్యవారిని పెట్టుకొని ఇంగ్లీషు నేర్చుకొన్నాడు ధారాళముగా ఇంగ్లీషు మాట్లాడుతాడు దొరలు మాట్లాడినా ఇంగ్లీషు ఇట్టే తెలుసుకొని ఇంగ్లీషు లోనే జవాబులు చెప్పతాడు

పితృ పితామహార్జితము ఒక వెయ్యియకరాల మాగాణిభూమి, ఒక నూరు యకరాల మెట్టభూమి ఉంది తాత ముత్తాతలు “వస్తు కుమ్మెర్లో ముద్ర కిస్తులు కట్టలేము” అన్నప్పటికి తహసీల్దార్లు కిస్తులు పెంచడానికి మంజూర్లు చేసిన ఇసుక పర్రలు వందలకొద్ది యకరాలు నారయ్య హయాములో సరుకు వనాలు అయిపోయినవి అందువల్ల టోపు తేరము చేసి సరుకు కర్రల అడితి ఒకటీ రైసుమిల్లు ఒకటీ ఉన్నవి ఆయన ఆ గ్రామపంచాయతీబోర్డు ప్రెసిడెంటు కూడాను ఇంకా ఇట్లాంటి గౌరవోద్యోగాలు ఎన్నో ఉన్నవి వదిలే చోట ధారాళముగా వదలిస్తూ—పట్టవలసినచోట మంచి గావుపట్టు పట్టుతూ ఆయనకు బాగా తెలుసు దానమూ ధర్మమూ పేరూ ప్రతిష్ఠ కలవాడు

వ్యాపారమూ వ్యవహారాలూ నారయ్యవంతు వ్యవసాయమూ గొడ్డూ గోదా ఇల్లూ వాకిలీ మొదలు అయినవి అన్నీ సుబ్బమ్మవి నారయ్య చెప్పినమాట అడుగోవ్వ ఎప్పుడు అయినా దలామణీ కాకపోతే కాకపోవచ్చును, కాని సుబ్బమ్మ మాట అడుగోవ్వ సుగ్రీవాజ్ఞ ఇకను ఆ దంపతులకు తీర్పరీ కూర్పరీ కరణము రామయ్యపంతులు రామయ్య నారయ్యకన్నా పదిఏళ్లు చిన్నవాడు

రామయ్యమాట నారయ్య ఎన్నడూ తీసివేసేవాడు కాడు నారయ్య చెప్పింది చేయకుండా రామయ్య ఎన్నడూ ఉల్లంఘించిందీ లేదు ఇద్దరూ ఒక్కమాటమీద పోవాండ్లు అందువల్లనే

గ్రామములో పోట్లాటలు వచ్చి పార్టీలు పడి గడ్డి వాములు తగులబెట్టుకోడము కానీ వారి గొడ్లకు వారూ వీరూ వీరిగొడ్లకు వారూ మందులుపెట్టి చంపి వేయడాలు గానీ లేవు ఇన్ని మాటలెందుకు— అది బస్తీపక్కన ఉన్న పల్లెటూరు. అయినప్పటికిన్నీ ఒక సివిల్ వ్యవహారము కానీ ఒక క్రిమినల్ వ్యవహారము కానీ ఊరుదాటి కోర్టుకు పోయింది లేదు

నారయ్య కానీ అంత కుంకుమబొట్టు పెట్టుకొని లోపలినుంచి బయటకు వచ్చినాడు అప్పుడే జోస్యులున్నూ వచ్చినాడు జోస్యము వినడానికి సుబ్బమ్మకూడా వచ్చి తలుపుచాటున నిలుచున్నది నారయ్య జ్యోతిషిని ఎగాదిగా చూచి "బాలజ్యోతిషం వృద్ధవైద్యం" అన్నారు. కానుంది జోస్యులూ జాతకము ఇవ్వగానే ముందుగా ఏమి ఆలోచిస్తావు?" అని ప్రశ్న వేసినాడు

"ఆయుర్దాయాన్ని గురించి ఆలోచిస్తాను"

"అయితే ఈ జాతకానికి ఆయుర్దాయము చెప్పు" అంటూ జాతకచక్రము ఉన్న కాగితము నారయ్య జోస్యులకు ఇచ్చినాడు రామయ్య "జోస్యులు బాబూ లగ్నము ఏమిటి—నక్షత్రము ఏమిటి" అన్నాడు.

"మేషలగ్నము—మఘానక్షత్రము" అంటూ "జాతకుడికి దీర్ఘాయుర్దాయము పట్టింది జాతకము మహాదొడ్డది ఒక్క పంచమ భావానికి తప్ప మరి ఏ ఇతర భావానికి ఏదోషమూ లేదు పంచమాధిపతికిన్నీ పంచమ స్థానానికిన్నీ పాపార్గళం పట్టింది పుత్రకారకుడు అయిన "

"ఇదుగో జోస్యులూ మాకు నీశాస్త్రము గోల అంతా అక్కరలేదు ఫలము చెప్పండి" అన్నాడు నారయ్య

"ఇప్పటికి సంతానము లేదు" అన్నాడు జ్యోతిషి

"సరే ఇకముందు సంగతి?" అన్నాడు రామయ్య

"అయితే కర్మస్థానాధిపతి అయిన."

"దత్తుచేసు కొంటానేమో చెప్పవయ్యా" అన్నాడు నారయ్య.

"దత్త పుత్రయోగము లేదు."

"దత్తు చేసుకొంటే"

"దత్తత చేసుకోటము ఉండదు. అధవా దత్తత చేసుకో తలచుకొన్నా కొనసాగదు. విఫలము అయి పోతుంది"

"అంటే"

దత్తుకు ఇంటికి రాగానే చస్తాడు"

"అమ్మనాయనో—పుత్రశోకముకన్నా దత్త పుత్రశోకము పట్ట శక్యముకాదు అన్నారు పెద్దలు" అన్నాడు రామయ్య నారయ్య ముఖము వెలా వెలా పోయింది

"అయ్యా ఈ జాతకములో ఉపపదానికి చంద్రశుక్ర సంబంధము పట్టింది కాబట్టి కళత్రము ఉంటుంది. కర్మస్థానము బాగాఉంది కర్మకారకుడూ కర్మాధిపతీ బాగా ఉన్నారు "శుభదృగ్యోగాత్సుందరీ" అని సూత్రము మంచి అందకత్తెను జాతకుడు కొద్ది రోజులలో పెండ్లి చేసుకొంటాడు "వ్యయశేసుప్తాచ" "చంద్రే జైకపుత్రః" అనే సూత్రాలున్నూ జాతకానికి అన్వర్తిస్తవి ఆ అందకత్తెకు ఒక పిల్లవాడు పుట్టుతాడు. వాడు ఈ జాతకుడికి కర్మాధికారి అవుతాడు. తప్పదు"

నారయ్య పకపకా నవ్వినాడు సుబ్బమ్మ తీవ్రముగా ఆలోచించడము మొదలు పెట్టింది. రామయ్య "శాస్త్రులవారూ, సంతానము ఇంకా ఎంత కాలానికి కలుగుతుంది" అని ప్రశ్నించినాడు

"ఎక్కువ ఎంతో కాలానికా— ఇప్పుడు కర్మాధిపతి అయిన శనిదశలో కుటుంబాధిపతి అయిన శుక్రభుక్తి నడుస్తూఉంది కొద్దిరోజులలో కళత్రమూ ఆ తరువాత—నేటికి పదహారు మాసాలలో జాతకుడికి కర్మచేసే పిల్లవాడు పుట్టుతాడు "

"అట్లా నిజముగా పదహారు మాసాలలో పిల్లవాడు పుట్టినట్లయితే మీకు నూటపదార్లు బహుమానము ఇచ్చిస్తాను" అన్నాడు రామయ్య

"తప్పకుండా నూటపదహార్లూ బహుమానము పుచ్చుకొంటాను" అన్నాడు జోస్యుడు. నారయ్య పది రూపాయలు తాంబూలములో పెట్టి జ్యోతిషిని సన్మానించినాడు. రామయ్యతో జోస్యుడు వెళ్లిపోయినాడు. నారయ్య పెండ్లాన్ని చూచినా "నేను దత్తుచేసుకొం

టాను అని మాట ఇచ్చినాను. ఏమి అవుతుందో చూడవలెను" అన్నాడు.

"ఏమి అవుతుంది కోమట్ల కోటివాక్యాన "

"అయితే నేను దత్తు చేసుకోడము నీకు ఇష్టము లేదు అన్నమాట"

"నేను అనేకసార్లు చెప్పినాను మీరు విన్నారు కారు. ఏమి చేసేది? మొగుడికి పుట్టిన పిల్లవాడు అయినా పెండ్లానికి పుట్టిన పిల్లవాడు అయినా ఉపయోగపడుతాడు కాని ఏ అయ్యకో ఏ అమ్మకో పుట్టినవాడు ఎప్పుడూ అక్కరకురాడు" అంది సుబ్బమ్మ

"ఎట్లాగూ—" అని నవ్వినాడు నారయ్య

* * *

జ్యోతిష్కి చెప్పిపోయినట్టుగానే నారయ్య దత్తు చేసుకోదలచుకొన్న పిల్లవాడికి నాల్గురోజులు జ్వరము కాసి చనిపోయినాడు వంశము నిలవడానికి ఇంకొక పిల్లను పెండ్లి చేసుకోవలసిందేను అని సుబ్బమ్మ పట్టుపట్టింది రామయ్య అందుకు తోడా చేసినాడు నారయ్యకు ఇష్టముఅయినా కాకపోయినా గ్రహాల ప్రభావమో ఏమో మళ్ళీ పెండ్లి చేసుకోటానికి ఒప్పుకొన్నాడు సవతిని సంపాదించటానికి సుబ్బమ్మే పూనుకొన్నది బహు సంతానము చాలు ఉన్న కుటుంబాలలో పిల్లను తీసుకొని రావలెను అనుకొన్నది విచారించింది స్వయముగా బయలుదేరింది దూపాటి పేటలో ఒక పేదకుటుంబాన్ని చూచింది. ఆ ఇల్లాలు తొమ్మిదిమంది పిల్లలను కన్నది పెద్దపిల్లకు ఇరవై సంవత్సరాలు దారిద్ర్యమువల్ల పెండ్లి కాలేదు తల్లికి మాదిరిగానే రెబలు అల్లె ఉంది తల్లి చాలు పిల్లగా సుబ్బమ్మకు ఆ అమ్మాయి తోచింది ఆ పిల్ల తల్లితండ్రులనూ తక్కిన సంతానాన్ని పోషించే భారము తనదేను అన్నది. పెనిమిటికి పిల్లను కుదిర్చింది దైవానుకూలముగా ఉండేటందుకు ఏడుకొండలవాడి ఎదుట పెండ్లి జరుగవలెను అని నిర్ణయించింది

శుభ ముహూర్తాన తిరుమల క్షేత్రములో పెనిమిటి నారయ్యకూ సవతి మంగమ్మకూ మూడుముళ్లూ వేయించింది. అంతటితో ఆమెకు తనివి తీరలేదు. ప్రత్యేకముగా కొంగుల్నే సవతినీ అలమేలు మంగాపురము తీసుకొని పోయి అక్కడ దేవాలయంలో ఉన్న సంతాన గోపాలకృష్ణుడికి మొక్కించింది. పుట్టెడు పటికబెల్లము నైవేద్యము పెట్టించి నూతన వధూవరులచేత పసిపిల్లలకు పందారము పంచింది

తిరుపతినుంచి ఇంటికి తిరిగి రాగానే వ్యవసాయపు పనులు అన్నీ మంగమ్మ తండ్రికిన్నీ గొడ్డూ గోదా వ్యవహారాలు అన్నీ మంగమ్మ తల్లికి సుబ్బమ్మ ఒప్పగించి వంట ఇంటి పెత్తనము మాత్రము తనమీద వేసుకొంది నారయ్యకూడా సుబ్బమ్మకు ఏమాత్రమూ తీసిపోలేదు తమ డాబామీద శీతవాత వర్షాతపాలకు లొంగిపోకుండా ఉండేటట్లుగా రెల్లు గడ్డితో చలువపందిరి వేయించినాడు ప్రాచీనార్వాచీన పద్ధతులను వేటినీ వదిలి పెట్టకుండా పడకగది సరంజామా అంతా కేటలాగులు అన్నీ చూచి మద్రాసునుంచి తెప్పించి ఆ చలువ పందిరిలో అమర్చేట్లు చేసినాడు అది నూతన వధూవరుల కేళీగృహము అయింది

నారయ్య అంతటితో పోనీయలేదు తన ముప్పదుగిరికి గుమాస్తాను ఏర్పాటు చేసినట్టుగానే రామయ్య పంతులు కరణీకానికిన్నీ ఒక గుమాస్తాను ఏర్పాటుచేసి తన రైసుమిల్లు—కప్పెల అడితి వ్యాపారము ఆయనకు ఒప్పగించి ఇల్లు కదలకుండా ఉండిపోయినాడు భోజన మజ్జనాదులకు తప్ప డాబా దిగడము మానివేసినాడు ఇక మంగమ్మ సంగతి చెప్పవలసిన అవసరమే లేదు

చక్కచక్కని ఎద్దుల జతను సంతలో చౌకగా కొనుక్కొని తెచ్చి ఇంత వడ్డికూడూ దాణా తెలకపిండీ పెట్టి మేపితే వారము రోజులలో తేరుకొని బుసలుకొట్టుతూ చక్కగా పొలము పనిచేస్తవి కుక్కకు ఒక్కపూట ఇంత అన్నము వేసి అంత బెల్లము పెట్టితే అది తెల్లవారేసరికి పుంజుకొని భౌభౌమంటూ ప్రతివాణ్ణీ కరవబోతుంది అయితే మానవుల ఎముక బొదుగులు తిండిమీద ఆధారపడవు అని ఇంగ్లీషు వైద్యులు అంటారు ఇది నిజమో వేసిజమో తెలియదు కాని మంగమ్మ మండలము రోజులలో గుర్తుపట్టడానికి వీలులేకుండా మారిపోయింది బంగారు శలాక మాదిరిగా తయారు అయింది షోడశకళా ప్రపూర్ణము అయిన చంద్రబింబము మాదిరిగా ఆమె ముఖము కనుపించసాగింది.

రోజులు గబగబా పరుగెత్తసాగినవి. మంగమ్మకు నిన్ననో మొన్ననో ఆ ఇంటికివచ్చినట్టుగా

ఉంది. కాని అప్పటికే రెండుకాలాలు గ్రుడ్డిదైపోయినవి సుబ్బమ్మ తాతగారికి జబ్బుగా ఉందిఅనీ ఒక్కసారి పుట్టినింటికివచ్చి పొమ్మనీ వర్తమానాలు వస్తూ ఉన్నవి ఆమె కాపురానికి వచ్చిన ఈపాతిక సంవత్సరాలలోనూ ఎప్పుడు పుట్టినింటికి పోయినా సాయంత్రానికి స్వగృహానికి చేరేది ఉన్న గొడ్ల పాలు సుబ్బమ్మ తప్ప మరి ఎవరూ తీయడానికి వీలు లేదు ఒకవేళ ఎవరు అయినా తీయబోయినా ఆ గొడ్లు ఆమెకు పాలుఇచ్చినట్లు ఇతరులకు ఇవ్వవు, తాతగారిని పోయి చూసిరావలెను అని సుబ్బమ్మకు ఎంతో అభిలాషగా ఉంది గొడ్ల పాలుతీయడము ఎవరికి ఒప్పచెప్పడము అనే చిక్కులో పడ్డది మంగమ్మ తల్లి తినకూడదు గొడ్లపాలు తీయడములో నేర్పరి అని చెప్పింది సుబ్బమ్మ మంగమ్మను పరీక్షకు పెట్టింది పొగ్గుఅవులుకూడా మంగమ్మ చెంబు తీసుకొని కూర్చుంటే కేర్లకు కేర్లుపాలు కార్చడము మొదలుపెట్టినవి సుబ్బమ్మ నిజముగా ఆశ్చర్యపడి పోయింది "పది సంవత్సరాల ఈమధ్య ఈ గొడ్లు నాకు ఇన్ని పాలుఇచ్చి ఎరగవు చెల్లెలా నీ సుతారము నాకు కూడా నేర్పు" అంది సుబ్బమ్మ మూడు రోజులు అయ్యేసరికి గొడ్లు అన్నీ మంగమ్మకు మాలిమి అయిపోయినవి పాలు సమృద్ధిముగా ఇవ్వడము మొదలుపెట్టినవి సుబ్బమ్మ ఎంతో సంతోషపడ్డది "చెల్లెలా, నా ప్రాణము తెరపినపడ్డది ఇంతకాలమూ ఏ ఊరు అయినా పోయి నాల్గురోజులు ఉండి రావడానికి ఈ గొడ్లమూలాన వీలు కాకుండా పోయింది అబ్బ ఇంతకాలానికి నీవు దేవతవు మల్లె వచ్చినావే చెల్లెలా!" అంటూ సుబ్బమ్మ మెచ్చుకొన్నది

ఇంతలో సుబ్బమ్మగారి పుట్టింటినుంచిజట్కాబండి వచ్చింది ఆమె తాతగారు ఏక్షణమో ఆఖరుశ్వాస విడిచేట్లు ఉన్నాడు అనీ ఆమెను ఆయన చూడవలెను అనుకొని బండి పంపించినారు అనీ బండివాడు చెప్పినాడు ఆమెకన్నుల వెంట నీరు కారుతూ ఉంటే "ఎందుకు అక్కా ఆలోచిస్తావు, ఏమీ భయములేదు పోయిరా నేను అంతా జాగ్రత్తగా చూసుకొంటాను"అన్నది మంగమ్మ

"చెల్లెలా ఈ రోజు పగలు ఎట్లాగో గడుపు, నావెంట మీ అమ్మనుకూడా తీసుకొనిపోతాను మా ఊరు ఇక్కడికి మూడుమైళ్లే ఉంది వస్తే ఇద్దరమూ సాయంత్రానికి వస్తాము. లేకపోతే మీ అమ్మను పంపించివేస్తాను," అని మంగమ్మతో చెప్పినారయ్యగారుకూడా తనవెంటరమ్మన్నది సుబ్బమ్మ ఆయన అయితే బయలుదేరలేదు కాని సుబ్బమ్మ ఆమెకు తోడుగా మంగమ్మతల్లి జట్కాబండిలో ప్రయాణము అయిపోయినారు

సుబ్బమ్మ పుట్టింటికి వెళ్లిన రెండురోజులకు నారయ్య జిల్లాబోర్డు మీటింగుకు వెళ్లవలసి వచ్చింది అతను అమరునాడే రావలెను అనుకొన్నాడు కాని సాధ్యముకాలేదు వారము రోజులు అయినా సుబ్బమ్మ కానీ నారయ్యకానీ తిరిగి రాలేదు అంత ఇంటికే మంగమ్మే సర్వాధికారి అయిపోయింది

అది కార్తీకమాసము మధ్యాహ్నము మూడు గంటలు అయింది హఠాత్తుగా మబ్బులుపట్టినవి కాస్సేపటిలో చీకటిపడ్డట్టు అయిపోయింది బీటిలోకిపోయినగొడ్లు అన్నీ ఇంటికి వచ్చినవి జీతగాండ్లు అందరూ ఇండ్లకు పోయినారు రాత్రి పడుకోడానికి వచ్చే జీతగాండ్లు అన్నాలు తిని వస్తాము అని చెప్పి వెళ్లిపోయినారు చీకట్లు బాగా కమ్ముకొన్నందువల్ల ఇంకా ఎంతపొద్దుఉంది తెలియలేదు ఎప్పుడో ఎందుకు అనుకొని గురవడు వంట చకాచకా చేసి వడ్డించాడు కొద్ది కొద్దిగా చినుకులు పడుతూ ఉన్నవి గాలియాత్రము జోరుగా ఉంది మంగమ్మ పొంతకుండలో వేడినీళ్లు స్నానము చేసింది శీతాకాలాన్ని మించిన చలివేస్తూ ఉంది ఉత్తరమునుంచి విపరీతము గాలితోలుతూ ఉంది ఆచలికి మంగమ్మ గోజాకన్నా మరికాస్తఅన్నము తిన్నది పయికిపోయి పడుకోడము ఆగాలీ వానలో సాధ్యము అయ్యేట్లు ఆమెకు కనిపించలేదు కిందనే పడుకొంది చీకటిపడేవేళకు చినుకులున్నా జోరు చేసినవి మంగమ్మ కాలుకు ముసుగుపెట్టుకొని పడుకొంది ఇట్టే నిద్రపట్టింది

రాత్రి తొమ్మిదిగంటలు అయింది మంగమ్మ ఉలిక్కిపడ్డట్టుగా లేచింది గాలి ఈలలు వేస్తూ ఉంది వాన ఎడాపెడా కొడుతూఉంది దీపాలు ఎప్పుడో ఆరిపోయినవి దీపము వెలిగించడానికి నిప్పుపుల్ల గీస్తే నిలవలేదు, ఆరిపోయింది.

గాలివానవాడు రాత్రి ఇంటి కాపలావాడూ సురవడూ తప్ప ఏ జీతగాడూ ఇంట్లో లేనందుకు నారయ్యకు [illegible] కోపము వచ్చింది. కాని ఎవరినీ ఏమీ అనలేదు గొడ్లకొట్టము కొట్టుకొని పోవడము తప్ప ఏ నష్టమూ లేకుండా పోయినందుకు మనస్సులో సంతోషించినాడు గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు అందరూ ఉండడానికి బందోబస్తు అయిన భవంతి వేయించడము మొదలు పెట్టినాడు

సుబ్బమ్మ తాతగారు చనిపోయినాడు దిన వారాలు అయిన తరువాత ఎంతో దుఃఖముతో ఇంటికి తిరిగివచ్చింది గాలివానకు ఏ నష్టమూ రానందుకు ఆమె సంతోషపడ్డది గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు కూడా తమ ఆవరణములోనే కాపురాలు ఉండే ఏర్పాట్లు నారయ్య చేస్తూఉన్నందుకు ఆమెకు మరింత సంతోషము వేసింది

అంతవరకూ మందకొడిగా అయోమయముగా ఉంటూవచ్చిన సురవడు మహా హుషారుగా పనులు చేస్తూఉండడము చూచి ఆశ్చర్యపోయింది అందులో పలకరించినా మాట్లాడనివాడు ఎవరు ఏమి అడిగినా తడుముకోకుండా సురవడు సమాధానాలు చెపుతూ ఉంటే సుబ్బమ్మకు మరింత ఆశ్చర్యము వేసింది

మంగమ్మకు నెల తప్పిపోయింది సుబ్బమ్మ సంతోషానికి మేరలేకుండా పోయింది మూడు నెలలు గడిచినవి మంగమ్మకు కడుపువచ్చినట్లు రూఢి అయిపోయింది ఆమె కొడుకును కంటుందో కూతురును కంటుందోనని అందరూ ఆలోచించ సాగినారు. ఆ ఇంట్లో ప్రతిరోజూ అచ్చట్లూ ముచ్చట్లుగా ఉండి ప్రతిక్షణమూ పండుగగానే ఉంది ఊళ్లోవాండ్లు, అందరూ పండ్లు పసుపు కుంకమూ పట్టు రవికెగుడ్డలు, పట్టుచీరలు తెచ్చి ఇవ్వసాగినారు. ఆ ఊళ్ళోవున్న బ్రాహ్మణఇండ్ల ఆడవాండ్లు కూడా యథాశక్తిన పసుపూ కుంకమూ తెచ్చి ఇచ్చినారు మంగమ్మకు కొడుకు పుట్టవలెను అనే అందరూ కోరుకొన్నారు వేళాకోళానికి సుబ్బమ్మ కూడా ఇక బిడ్డలను కంటుంది అని అన్నారు.

ఇల్లు అంతా ఎంత గబగబలుగా ఉన్నా ఎంత కోలాహలముగా ఉన్నా సుబ్బమ్మ వెయ్యికళ్ళతో సురవణ్ణి కనిపెడుతూఉంది నారయ్య ఏదో పట్టణవాసముమీద పల్లెటూరికి పోయినాడు. రాత్రిభోజనాలు అయినవి సవతులు ఇద్దరూ కబుర్లు చెప్పుకొంటూ తాంబూలాలు వేసుకొంటున్నారు. సురవడు యథా ప్రకారము డాబామీదికి మంచినీళ్ళు వగయిరాలు తీసుకొనిపోతూ మంగమ్మ వంక చూడకపోయినా ఆమె వాడితో నేత్రసంభాషణము చేయడమూ కనిపెట్టింది. ఏమి తెలియనట్టుగా అమాయికముగా "చెల్లెలా— వారు ఊళ్ళో లేనరోజు పయిన పడుకోడము ఎందుకు నీకు జోరువచ్చినా ఒళ్లు తిప్పినా పైనుంచి నీవు కేకలు పెట్టితే మేము లేస్తామా— లేవలేపోతాము కాబట్టి కిందనే పడుకో"మంటూ సుబ్బమ్మ మంగమ్మ ముఖము తేరి పారచూచింది

"అక్కా నాకు ఆమంచముమీద పడుకొన్నట్టుగా ఏమంచముమీద పడుకొన్నా ఉండదు"

"అయితే ఆ మంచమే ఇక్కడికి తెప్పించేది"

"నాకు ఆ మరలుతీయడము చేతకాదు"

"చేతనయినవాండ్లే తెస్తారు" అంది ఆ మంచాన్ని అప్పటికే అప్పుడు కిందికి తెప్పించింది మంగమ్మ తీవ్రముగా ఆలోచించింది ఆమెకు భయము వేసింది ఆ క్షణమే ధైర్యము తెచ్చుకొన్నది సుబ్బమ్మ తనమీద ఆ పేచీ చేతనే అట్లా చెప్పి ఉంటుంది అని నిశ్చయించుకొన్నది కాని ఆమె బుర్ర పరిపరివిధాలపోతూ ఉంది

"చెల్లెలా—నిద్రపోతున్నావా" అంటూ సుబ్బమ్మవచ్చింది

"లేదు" అన్నది మంగమ్మ

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"అబ్బే ఏమీ లేదు"

"ఇక రేపటినుంచి నేనే గొడ్డూ గోదా చూచుకొంటాను మీ అమ్మకు వంట ఇల్లు ఒప్పచెప్పతాను సురవణ్ణి వంటపనిలోనుంచి తగ్గించి వేయవలెను అనుకొంటున్నాను"అన్నది సుబ్బమ్మ

"మంగమ్మ చూస్తూ ఊరుకుంది.

"చెల్లెలా ఎందుకు అట్లా చూస్తావు వాణ్ణి అసలే పంపించి వేదామా అని కూడా అనుకొంటున్నాను"

"మీ ఇష్టము"

"నీవు తెలివిలయినదానివే చెల్లెలా—అప్పుడే—అంతే," అంటూ సవతిపక్కలో కూర్చుని సంతోషముతో ఆమెను కౌగిలించుకుని చేతితో నిమిరి "హాయిగా నిద్రపో" అని చెప్పి వెళ్లిపోయింది

సుబ్బమ్మ యథాప్రకారము పాన్పులో పడుకొంది సంతోషాతిశయమువల్ల కాబోలు ఎన్నడూ లేని పద్ధతిని సొమ్మసిల్లి నిద్రపోయింది తెల్లవారుఝామున మూడుగంటలు కావస్తూఉంది సుబ్బమ్మకు హఠాత్తుగా నిద్రమెలకువ వచ్చింది పక్కగదిలో మనిషి అలికిడి అయింది క్షణకాలము ఆలకించింది. చడీ చప్పుడూ లేకుండా బయటికి నడిచింది గొడ్ల కొట్టములో గురవడి గదిదగ్గరకు పోయింది. తలుపు బయట తాళము వేసిఉంది మారుతాళము చెవితో తాళము తీసింది లోపలికి పోయింది పెట్టెతీసి చూచింది ఏభైరూపాయలు కనిపించినవి పట్టరాని కోపము వచ్చింది తన మెడలోఉన్న కాసులదండ అమాంతముగా తెంచింది ఆ తెంచడములో కొన్ని కాసులు క్రిందపడ్డవి మిగతా కాసులు ఆ పెట్టెలో పెట్టి మూతవేసింది యథాప్రకారము తలుపుకు తాళంవేసింది రెండోకంటికి తెలియకుండా వచ్చి పడుకొంది

పడమటిఇంట్లో గురవడు పొయ్యిలో నిప్పు రాజేస్తున్నాడు

హఠాత్తుగా సుబ్బమ్మ "ఆఁ ఆఁ" అంటూ "నా మెడలో కాసులదండ ఎవరు తెంచుకున్నారు" అంటూ కేకలు పెట్టుతూ లేచింది

* * *

కరణము రామయ్య ఆశ్చర్యముతో "అది ఏమిటి అక్కయ్యా—తెల్లవారుతూ ఉండగా నీ మెళ్ళో కాసులపేరు తెంపుకొనిపోవడము ఏమిటి?" అన్నాడు

"అదే—పంతులూ—ఆశ్చర్యము. పోలీసులను పిలిపించు" అంది సుబ్బమ్మ

రామయ్య ఆలోచిస్తూ "ఎవళ్లో ఏమిటో మనము ముందుగా " అంటున్నాడు సుబ్బమ్మ ఉగ్రమూర్తి అయి "పంతులూ యావన్మందినీ బయటకు లాగించి తాళాలు వేయించడమే కాదు" చూడు నా ఇంటికికూడా తాళము పెట్టించినాను. నాఆవరణలో ఎవరు తప్పుపనిచేసినా క్షమించేది లేదు ఎందుకు అనుమానిస్తావు! నీవు పోలీసులను పిలిపిస్తావా లేకపోతే నేనే పోయి పోలీసులను పిలుచుకొని వచ్చేదా"అంది

పంతులు నిబ్బరముగా "నాకు మున్సబుగిరీ వచ్చింది మొదలు ఈ రోజువరకూ ఒక్క క్రిమినల్ కేసు పొలిమేర దాటిపోలేదు బాబు ఏమంటాడో నని ఆలోచిస్తున్నాను" అన్నాడు

"పంతులూ బాబుగారు ఏమీ విన్నా అనకుండా ఉంటేభారము నాది"

"అయితే పోలీసులను రప్పించడము ఎంతమహాభాగ్యము అక్కా ఇల్లు సోదా చేయించవలసి వస్తుంది సుమా"

"అదే నేను కోరుతూ ఉంది"

"సరే" నన్నాడు పంతులు

* * * *

గురవడిమీద క్రిమినల్ కేసు విచారణకు వచ్చింది మేజస్ట్రీటు ఉగ్రుడు అయిపోయినాడు సంవత్సరము కఠినశిక్ష విధించినాడు

* * * *

తొమ్మిదోమాసము నిండుతూ ఉండగా మంగమ్మ సుఖముగా ప్రసవించింది దుంపముక్కవంటి మొగ పిల్లవాడు పుట్టినాడు

బ్రహ్మాండముగా బారసాలతంతు జరిగింది నూటపదార్లు తీసుకోడానికి జ్యోతిష్కుడు హాజరు అయినాడు ఊరివారి అందరికీ మృష్టాన్నదానము చేసినారు.

సుబ్బమ్మ సాయంత్రము అప్పుడు సంతోషముగా శిశువును పెనిమిటిదగ్గరకు తీసుకొనివచ్చి "చూడండి. ఎంతచక్కనివాడో చూడండి, అచ్చము మీ పోలికను. ఆ గడ్డము — ఆ ముక్కు — ఆ కన్ను అంతా మీరేను" అంటూ నవ్వింది

నారయ్య శిశువునూ ఆ శిశువునుకన్న మంగమ్మనూ చూస్తూ బ్రహ్మానందపడిపోయినాడు,

